3

# కాంతి కిరణం

## (యేసుక్రీస్తు)

(పద్యకావ్యం)

రచన:

వంగపండు అప్పలస్వామి,

ఎం.ఎ. (పాలిటిక్స్), ఎం.ఎ.

# తొలిపలుకు

ఒకప్పుడు . . . భగవంతుని హస్తకృతమైన ఈ ప్రపంచం పాపాంధకారంలో కొట్టుమిట్టాడుతుంది. దారీతెన్నూ లేక అంధకారమయమైన ఈ జగత్తులో ఆశాజ్యోతిగా వెలిశాడు—యేసుక్రీస్తు.

ఆ దివ్యజ్యోతిని పరిగ్రహించిన వారి హృదయాలలోని అంధకారం పటాపంచలై, ఆనందం వెల్లివిరుస్తుంది. శాంతి, సమాధానం, శాశ్వతంగా లభ్యమవుతాయి.

ఈ భావాన్ని వ్యక్తపర్చుతూ మధురమైన పద్యాలలో 'కాంతి కిరణాన్ని' ఆంధ్ర పాఠకులకు అందిస్తున్నారు — అప్పలస్వామిగారు. వీరి కృషి ప్రశంసనీయం.

దాన్ బాబు,
ఎడిటర్.

# మనవి

సర్వమత సామరస్యత సన్నగిల్ల
సకలజాతి సమైక్యత సాగుబెట్టు
దైవభావమె జగతిని తాండవింప
క్రైస్తవేతరు డీకృతి క్రీస్తు పొగడె.

కమ్మని పదాలు యిమ్ముగ గుమ్మరిలగ
సొంపొసంగిన భావాల సూక్తిమెరయ
రసము విరజిమ్ము రమ్యంపు రచనయౌను
కవిత నిజమిది దేవుని కరుణగాదె.

తెనుగు నుడికారమెంతయు తేటపడగ
సహజ కవితారసస్ఫూర్తి చౌకళింప
భావనాశ్వమ్ము జవమున పరుగులెత్త
రచనజేసితి సత్కృతుల్ రమ్యమనగ.

రచయిత

Human life is the theatre of a Cosmic struggle between the goodness of God and the evils of rebellious spirit.

—*Augustine*

# విషయ పరిచయం

# 1–వ ప్రకరణము

## కాంతి కిరణము

శ్రీకరమగు తేజంబది
లోకమునకు దెలియ బడగ లోకుల గావన్
లోకములో నుదయించెను
లోకాలకు వెలుగు జూప లోకేశుడుగా. 1

అరయ నాదిని వాక్యమె యమరియుండి
దైవ సన్నిధి నది యుండె తత్త్వమరయ
సర్వసృష్టికి కర్తయు సర్వమయుడు
దేవుడే జూడ వాక్యంబు తేజమతడె. 2

జీవమాతనిలోనుండు జీవరాశి
కారు చీకట్ల బాయంగ కాంతి నిడును
శాంతిగోన మానవాళికి క్రాంతి నొసగు
జీవమేగద వెలుగిడి త్రోవజూపు. 3

కాలయవనిక చాటున కాంతిబాసి
కలుషమగు జీవితాలతో కలతనంది
ముక్తి మోక్షాలగానక మూల్గుచున్న
పాపులకు జ్ఞానమార్గపు దీపమదియె. 4

జనత వెలుగును కానక ఘనతబాసి
దురితముల దేలి దూరుచు దూరమవగ
మనకలను బాపి మహికెల్ల మంచినిడగ
కాంతి యొకనాడు గగనాన కానబడియె. 5

ఏమి యద్భుత మీకాంతి యెంచ జూడ
మెవరు కర్తలో దీనికి యెరుక పడదు
తిమిరమును బాపె దేదీప్య తేజమిదియ?
నరుల యజ్ఞాన రేఖల నరకు నదియ? 6

వెలుగు జూడని కొందరు తెలియబలక
వేల్పుజాడని యొకరో వేడ్కపడిరి
అవని కొరక ముక్తి మార్గము నందజేయ
నవతరించిన యాకాశ దివ్యోయనిరి. 7

నరుల గమనము దెలిపిన నాణెమనగ
కాలరీతిని కొలచెడి క్రాంతి యనగ
విశ్వజనతల నందెడి వెలుగనంగ
నాడు రూపొందె నా కాంతి ఆకసమున. 8

విశ్వతేజము నరసిన విధము బాసి
ధూర్తలో భయభీతులు యలముకొనగ
అదరినారంత పరుగిడ చెదరినారు
వెనుకకే జూడకను ప్రజ వెడలుచుండె. 9

వెరగు పడివారలీరీతి పరుగులిడిన
అమరవాణియు నంతట ననియె నిట్లు
భయము వీడండి మీకును అభయ మొసగు
ననుసరించిన వారికి యమృతమె యది. 10

ఆత్మ పరిశుద్ధ భావము యవని వెలయ
మిగుల విశ్వాస భరితులై మెలగ గలిగి
మేలిమినిపొంద ప్రజకెల్ల మేలొనర్చ
వెలుగు యీరీతి దోపగ వెరువ నేల. 11

నరుల కానతి నివ్వగ నడచివచ్చె
దైవదూతయు నంతట దర్శనమిడె
ఇహమునందున్న వారల కింపు గూర్చ
పరమునందున్న శక్తులు పయనమయ్యె. 12

తెలిపె నీరీతి నంతట దేవదూత
కాంతి నందుచు కదలండి క్రాంతివచ్చు
మహిని విజ్ఞాన జిజ్ఞాస మార్గమిదియె
మానవత మచ్చు బాపెడి మరకత మది. 13

లోకరక్షకు డుదయించు లోకమందు
కక్షకలతలు పాపాలు కానబడని
దివ్య సౌందర్య భావన దీప్తినిడగ
నమితమగు తేజమీరీతి నవనిదోచె. 14

భయము విడనాడి మీరంత భక్తితోడ
వెడలి గనరండి స్వామిని వేడ్క మీర
ఉద్భవించాడు యుర్విని యుద్ధరించ
మానవాళికి మిగుల మహాత్ముడగుచు. 15

దైవదూతలు నీరీతి దారితెలుప
నరగ దలచిరి వారంత హర్షమంది
పుణ్యపురుషుడు వెలసిన పురమువైపు
పుడమి జనులెల్ల పుణ్యాలు వడయుగాను. 16

సకల లోకాల కల్లను సాంపులడు
ప్రభవమందెను పశువుల పాకనున్న
గాడినరయ నిదెంత నిగూఢమయ్యె
విశ్వపతి పుట్టుకచ్చోట వింతయొకద! 17

స్థలమునందలి గూఢార్థమిలకు దెలియు
పశువు, పాకయు, నందున్న పశులగాడి
మూర్ఖ, దారిద్ర్య, పాపాల, మూర్తులవును
పుడితివచటను వాటిని పుటకరించ. 18

పుణ్యజనులంత బోయిరి ధన్యులైరి
పుడమి రక్షించు ప్రభునకు పూజలిడుచు
పరగ పరలోక దూతలు ప్రార్థనలిడ
పతితులెల్లరు గతినంద ప్రభువు వెలసె. 19

కామ క్రోధ లోభాలకు కాలుజారి
కారుచీకట్లలో నరుల్ కష్టమొందు
అవని రక్షించి యార్తుల నాదుకొనగ
లోకరక్షకు డుదయించె లోకమందు. 20

దుష్టుడును దుర్గుణుండును స్పష్టతగొన
భ్రష్టులకు నెల్ల నభయ దానంబు నిడగ
పతితులనుగాచు పరమ పవిత్రుడనగ.
ఉద్భవించెను యీ ధాత్రి నుద్ధరించ. 21

లోకరక్షకు డెటనుండో కేకనిడిన
నాకసమున నున్న దైవమె రాకయున్న
లోకులకు నెల్ల యనుభవం గాకయున్న
తూకమందున దివ్యాత్మతులను తూగి. 22

ఇలను వెలసిన యా తేజ మెరుకపడెను
సకల ప్రజకెల్లనది యొక సత్యమనగ
దైవలీలల తెలియంగ తరమె మనకు
పుట్టుకల నిచ్చు దేవుండు పుట్టుటేమి. 23

లోకమున సవ్యమగు రీతి లోటువడిన
ఇలను ధర్మంబు యెంతైన వెలితి పడును
ధరను సైతాను శక్తిని తరిమికొట్ట
ప్రభవ మందాలి దైవము ప్రజలకొరకు. 24

భౌతిక సుఖాల నందెడి భ్రాంతినంది
ఆత్మపరమగు రీతిని యందలేక
జ్ఞానమది బాసి యెంతో యజ్ఞానమందు
పాపులనుగావ నేతెంచె, రూపమందె. 25

ఆత్మ విజ్ఞాన రీతిని యందుకొనెడి
యర్హతెవరికి యేమేరకమరు నయ్యా?
మహినిగల దైవికులు జూడ మనకు నేడు
లెక్కకున్దొరుకుదురది నిక్కువంబు. 26

ప్రజ యున్న తాధ్యాత్మిక విజ్ఞతగొన
పారమార్థిక సత్యము పట్టువడును
పదుగు రటువంటి శక్తితో మెదలగలర?
ఉద్భవించును దైవము యుర్విగావ. 27

# 2–వ ప్రకరణము

## దైవ సాక్షాత్కారము

అభయ హస్తమునిడి మన కాదుకొనగ
ప్రీతి నిచ్చెడి దైవమె పిలువకున్న
లోపములనంది మిగులను పాపమందు
జనతయాతని ఘనతను గనగలేదు. 28

అవని వెలసిన దైవాంశ మందువలన
మహిమలను జూపి మనుజుల మార్చదలచె
కరుణ ప్రేమల నిడియును కాంతికలుగ
కలత బాసిల ప్రజలెల్ల క్రాంతినొంద. 29

ఆత్మ పరిశుద్ధ భావమీ యవని వెలుగ
నవతరించిన పరిశుద్ధు డతడెగాదె
కన్యకిల గర్భవతియయి గాంచుటేమి
క్రాంతి పరిశుద్ధ యాత్మిడు కరుణగాక. 30

జనత నాడెంతో ఆశ్చర్య చకితులైరి
జన్మమందిన బాలుని ఘనత లరసి
లోక రక్షకు డీతండె లోకులనగ
మిగుల కాంతియు విరజిమ్మె మేదినివయి. 31

దివ్యతేజము బాడగట్టు దిక్కనుగని
సర్వమానవ దుఃఖాలు సమసిపోవ
జ్ఞానులెల్లరు నాదెస జనగ దలచె
దైవ సందర్శనంబంది ధన్యతగాన. 32

జగతిగల జీవకోటికి జ్ఞానమొసగె
________ జగతి రక్షకుడాతండె జ్ఞానియతడె
జగతి జ్ఞానంబు నేర్పంగ జాలు నెవరు
జగతి కాతడు బాలుండు జ్ఞానమతడె. 33

ఈర్ష్య సుడిగాలు లెంతైన వీయుగాక
జగతి రాణించు చూడగ జ్ఞానజ్యోతి
దురభిమానాల నెల్లను దునుమ గలదు
భువినిగల జ్ఞానులెంతైన పొగడగాను. 34

ప్రభువు ననుచును ప్రజలకే భవుడననుచు
ధూర్తుడగు రాజు నాడొక దూర వెలసె
విశ్వజ్యోతిని యార్పంగ వెదకినాడు
ఉర్విగల యెన్ని దీపాల నూదగలడు? 35

ప్రభుని దండించు యాతని పన్నగడలు
ప్రతిఫలించెను యాతని వెతలగాను
పాప చింతన మదిలోన పాదుకొనగ
పారమార్థిక సత్యము పట్టువదునె. 36

కలుష పరుడగు రాజంత కఠినతగొనె
కాంతి కిరణోద్భ, వంబంధ కన్నుకుట్టె
కరుణప్రేమల నెల్లను కాలరాచి
కత్తిదిప్పిన మనసున కలత మిగిలె. 37

దివ్యులము మేము ప్రజలపవిత్రులనుచు
ఆడిపోసిరి నాటి పీఠాధిపతులు
అధికులము మేము ప్రజలెల్ల యధములనుచు
ఈసడించిరి యానాటి శాస్త్రులంత. 38

అదరి బెదరిరి యారాట మందినారు
యవని వెలసిన యాకాంతి నడ్డుపరచ
నడ్డుపుల్లలు వేసిరి దుడ్డు భ్రాంతి
నంది మిగులనశాంతిని పొందినారు. 39

దుర్గతిని బాపి మానవ ధర్మము గని
ఉర్విగల ప్రజకెల్లను యొసగ దలచి
నవతరించిన మహనీయుడనగ వినమె
మంచికిలరూపు తెలివికి మార్గమితడె. 40

ఆత్మ పరమాత్మలవియు యనాదిగాగ
అడ్డుపడెడి యనాత్మల నవలద్రోసె
దివ్యపురుషుల రీతిని తెగడినారు
దైవదూషణపరులు సైతాను జనులు. 41

హేయమగు దేహభ్రాంతిలో నీదులాడి
తుచ్ఛమగు మేనిసుఖమందు తుంటరులను
ఆత్మ పరిశుద్ధ విశ్వాస మందుకొనగ
నభయ హస్తంబు నిడవె దయార్ద్రహృదయ. 42

పుడమి పాపాల నెల్లను కడుగగాను
యవతరించిన లోకేశు నధిగమించ
దుష్టశక్తులు యపవాద దుర్గతులును
యజ్ఞతను బొంది యాతని కడ్డుపడిరి. 43

దైవ రూపానికే మేము దగ్గరనుచు
డంబములు పల్కి డాబులు ఢక్కగొట్టి
భక్తిపరులము ప్రజకెల్ల ముక్తినిడుచు
ఉద్ధరించెదమనె కొందరిద్ధరిత్రి. 44

అందరాధ్యాత్మికపు శక్తి నందగలర?
అందునిలకొందరే దానికర్హులనుచు
స్వాధికారాలనది గాను స్వాములంత
శిష్టులుగనుండు రీతియె శ్రేష్ఠతగానె. 45

భ్రష్టులనుచును ప్రజలు పాపిష్టులనుచు
పతితులనుచును పరమ పాపాత్ములనుచు
అధములనుచును యల్పుల స్పృశ్యులనుచు
ఆడిపోసెడి జాతులు యవని వెలసె. 46

ధర్మము నశించి జగతిన ధర్మమెగసి
దురితములనంది ప్రజలెల్ల దుఃఖపడగ
పతన మందినవారికి గతినిగూర్చ
పిలుపు నివ్వగ దలచెను పీడితులకు. 47

అల్ప విశ్వాసభరితులై యడుగువేయు
యల్పులగు నాత్మ జ్ఞానంబు యర్థమగునె!
నరులు యేరీతి దేవుని యరయగలరు
దివ్య మహిమలు నవియెల్ల దెలియరాక. 48

జగతి కాతనిలీలాక ప్రగతి పథము
స్వీయమహిమను దెల్పెడి చిహ్నమగును
ఇహపరాలకు దారిని యివ్వగలది
దేవుడిల ప్రేమమయుడని దెలుపగలది. 49

విత్తనము, నేల, వృక్షాలు, విడివడవిల
ఐక్యతవిగొన యైశ్వర్య మవని దేలు
మూడు మూర్తుల రూపమైనాడు వెలసి
ఐక్యపడి యేకరూపాన యవనిగాచె. 50

సకల యాత్రల కాతండె సాక్షియైన
యాత్ర కేగెను జూప విచిత్రగతిని
తల్లడిలినారు పెద్దలు తెలియరాక
వెలుగు యెట కేగెనో యని వెదకివెదకి. 51

సకల శాస్త్రాల కాతండె సారమవగ
శాస్త్రులాతని యెదిరించి 'శాస్తి'గొనరె
హేతువాదమదొక్కటె హేయమనియు
హేతు విశ్వాసరీతిని యెరుకపరచె. 52

ప్రౌఢ విజ్ఞాన పండిత ప్రముఖులెల్ల
భంగపడినారు బాలుని ప్రతిభగాంచి
దివ్య సూక్తిని వెదజల్లు దైవవాక్య
మెవరు ఖండించగలరది యెవరితరము. 53

జ్ఞాన మార్గమునంతట జనతపొందె
హృదయసీమల దైవాజ్ఞ మెదలగాను
పాపపంకిల మెల్లను బాసిపోవ
హృదయ నైర్మల్య భావన యుట్టిపడగ. 54

బాలకునివెంట నిడుకొని బంధుకోటి
బిల్వ పెండ్లికి పెద్దలు బోవగాను
బంధువులు జూడ ప్రజలెల్ల భ్రాంతివీడ
మహిమజూపెను అదియొక మచ్చుతునకె. 55

పాత్రలందున పూర్తిగ ద్రాక్షరసము
దంతరించెను బంధువు లందుకొనగ
పలువురుండిరి లేకను పండ్లరసము
పెండ్లి పెద్దలు దిగులొంది రిండ్లలోన. 56

అంతలో దేవదేవుడు యంత దెలియ
పాత్రలందున గలనీరె పండ్లరసము
అనుచు తాకగ పానీయ మమృతమయ్యె
ద్రాక్షరసమిడె నెల్లరు మోక్షమంద. 57

అజ్ఞతను పొందు యపవాది యంతు తెలియ
నడగబడినాడు నాతనికొన కొదవ
అమృత మూర్తికి యాహార మవనికొరకె
సత్యమెరుగుము నీవిల సత్యమతడె. 58

# 3–వ ప్రకరణము

## జ్ఞానోదయము

దైవధిక్కార పరుల దుష్కార్యములను
దివ్యదృష్టిని గని యెల్ల దైవమెరుగు
తెలిసి తెలసిల క్రిములెల్ల తెలివిబాసి
వెలుగునందున బడి చావ వెడలునుగద. 59

'రొట్టెలుగ మార్చుమీ రాళ్లగుట్టనెల్ల
అదియె దేవుని ఘనతకు నానవాలు'
పాపి యపవాది మాటకు మారుపలికె
'మనిషికిల తిండి దేవుని మాటగాదె.' 60

ఇలనుగల పర్వతాగ్రము నెక్కి మిగుల
నుర్వి కురికియు నుపశాంతి నొందగలవ
యనుచు బలికెడి యపవాది నల్లనగని
ప్రభువు పలికెను దోప ప్రశాంత రీతి. 61

లోకలోకాల వెలుగగు లోకపతికి
శిఖరముననుండి దూకుట చిన్నపనియె
ఉన్నతినిబాసి ఊర్ధ్వాని కరుగుటేల
అల్ప సంతోషి యపవాదియనగ నిజమె. 62

ఏలుకో నీవు రాజ్యాలనెల్లను గొని
మహిమనందిన మానవ మాన్యములివి
యమరు నీకవి నాకు యారాధనమిడ
యనెడి యపవాది కీరీతి నాజ్ఞయిడెను. 63

పొమ్ము పాపాత్మ నీరీతి పొసగ దిచట
నీకు రక్షణ నిడగల నీశునకును
నీవు నిడువాడవీధర నెంత వింత
నిక్కమరయము ప్రభుగని మ్రొక్కలిడుము. 64

అనగ సైతానుయంతట యదరి జనగ
దేవదూతలు దిగివచ్చి దేవునరసి
సకల పరిచర్యములనంత సలిపినారు
దివిజ కాంతిల వెలసి దేదీప్యమంద. 65

అన్నివైపుల చీకటి యలముకొనగ
తిట్టుకొనుచును జీవించునట్టి ప్రజలు
నాడు జూచిరి నరులకు తోడునిలచె
దివినిగల కాంతి మిగులను భువినివెలుగ. 66

సాగరమునంటి తీరాన సాగిపోతు
జలధినందున తిరిగాడు జలచరముల
వలల సంధింప జూచెడి వారినిగని
పసిడి పలుకుల నీరీతి ప్రభువు పలికె. 67

దైవవాక్యము దెలిపెద దరికిరండి
మానవుల బట్టజాలెడి మహిమ నిడుదు
ఏనువార్తిల రూపొంది వెలుగు నిడునొ
ప్రజల కావార్త జేరగ ప్రకటనిదిగొ. 68

దైవవాణియు భువి ప్రతిధ్వానమందె
నాత్మ పరిశుద్ధ భావమీ యవని దెలియ
మందిరాలవి రూపొందె యందరిలను
బోధనలనంది రక్షణ పొందగాను. 69

మూర్ఖ యజ్ఞాన యాచార ముసుగులోన
మూల్గుచున్నట్టి జీవులు ముక్తినిగొన
యద్భుతాలను జూపెట్టెనవని ప్రజకు
నరయనాతడె భువికి మహాద్భుతంబు. 70

వ్యాధులనుపొంది బాధల నందువారు
వేదనలనంది వెదికిరి వేడుకొనిరి
రోదనంబిడు కడు కుష్ఠురోగు లిలను
పీడబట్టిన వారును కీడునంది. 71

కూడిరందరు తోడురా వేడికొనిరి
దేవదేవుని కష్టాల దీర్చమనిరి
కనికరించెను వారిని కరుణగలిగి
హస్తస్పర్శతో బాధలు యంతమవగ. 72

లోకబాంధవు డీరీతి లోకమెరుగ
జనతబాధల బోగొట్టి ఘనతగాంచె
జనసమూహము లానాడు జనిరి మిగుల
దర్శనంబంది జన్మంబు ధన్యతగొన. 73

అద్భుతాలకు నాశ్చర్యమంది ప్రజలు
వెంబడించిరి వేల్పును వేడుకొనగ
ఉన్నతాగ్రమునందు నాశీనుడగుచు
శిష్యబృందము యేతేర చెప్పెనిట్లు. 74

# 4–వ ప్రకరణము

## దైవోపన్యాసము

ధన్యతిల యాత్మధీనత నందినపుడె
దైవరాజ్యమె వారికి దగ్గరగును
ధన్యతనుగొను శోకించు దీనపరులు
ఒరుల యోదార్పునందు యదృష్టపరులు. 75

సాత్వికులు ధన్యులౌదురు సత్యమిదియె
కొదువయన్నది లేదిల కొరతపడరు
ఆకలినిగొన్న యవినీతి కరగకున్న
నొరుల సంతృప్తి నదిగొని మురియగలరు. 76

దయనుగల ప్రతియొక్కరు ధన్యులిలను
కనికరించగ బడుదురు కరుణదోవ
హృదయ నిర్మలతనుగొని వ్యధనపడరు.
సృష్టికర్తను వారంత చూడగలరు. 77

పలువురకును సమాధాన పరచువారు
ధన్యతనుబొందు దేవుని తనయులగుచు
జగతి కాపాడ బుట్టిన ప్రగతిపరులు
క్రాంతికరుణాల నందించు ఖ్యాతిపరులు. 78

నీతినియమాలు నీధర నిలువగాను
నిండు మనసుతో నాతోడ నుండువారు
హింస నందియు వారెల్ల వీగిపోరు
దైవరాజ్యమె వారిది ధర్మమిదియె. 79

నాదుమార్గము చేపట్టి నడచునపుడు
హింసలందిన మీకును నిడుదు ఫలము
హింసలను పొంది నీ యుర్వినున్నవారె
గతమునందు ప్రవక్తలు గనుము నీవు. 80

సారమదిలేని జీవి నిస్సారమగును
లోకులకునెల్ల లోబడి లోకువగును
తూకమందున ధరనొక రూకకైన
ఉప్పునిస్సార మందిన ఉర్విగలియు. 81

పర్వతాగ్రాన నెలకొను పట్టణంబు
ప్రజల కనుచూపులకు నది పట్టువడును
వెలుగు జ్యోతిని దాచుట వెకిలితనము
సర్వులరయుదు రదియున్న స్తంభమందు. 82

సత్క్రియలజేయ మీరంత సాగిపొండి
పరమునందున్న మీ తండ్రి పరవశించ
వెలుగుజాడలు ధరలోన వెడలినపుడు
ధరనుగల కారుచీకట్లు దరికిరావు. 83

గతప్రవక్తల వచనాలు క్షితినిగలవు
ధర్మశాస్త్రము బోధించ ధరకు తెలుప
వచ్చితినిగాని వాటిని వమ్మొనర్చ
జూచువానిగ నన్నేమొ జూడవద్దు. 84

పుడమి యాకాశమెటు కేగు? పొందికైన
అవనిగల ధర్మశాస్త్రము యవనివిడదు
లేశమాత్రము గోల్పోదు లేదు కొరత
తరుగుచును తప్పిపోవుచు నరుగదెపుడు. 85

నేను నుడివినరీతిని జ్ఞాన మెరిగి
మెలగువారెల్ల జగతికి వెలుగుకాదె
నాదు యాజ్ఞల జవదాటి యరుగునతడు
నరయనాతండు యత్యల్పుడనగ వినమె. 86

సోదరుల జూడుమదినీకు సొంపునిడును
దూషణది యేల దుర్నీతి దోవగాను
పలువురకులొంగి దూషుండు పతనమవడె
ద్రోహి యనుచేల నరకాగ్ని దూరుచేల. 87

సఖ్యతందియు నిల సమాధానపడుము
సోదరవిరోధ మిలనొక శోకమెగద
మిగుల ద్వేషము మనిషికి రగడదెచ్చు
స్నేహభావమె మానవ ధ్యేయముగద. 88

అర్పణంబిడ బలిపీఠ మందు వేళ
వైరభావమె నీలోన వదలకున్న
వెడలి అరితో సమాధాన పడినపిదప
తిరిగి యర్పణ నిడగను యరగవయ్య. 89

వాదప్రతివాదముల నంది వేదనపడి
ఇరుగుపొరుగుల వారితో నీర్ష్యపడకు
తీర్పరుండును నీమీద తీర్పునివ్వ
ఒరులతో పొందు మిగుల వసందుగాదె. 90

మోహమున దేలి వెలయాలి మోముగనిన
స్ఖలితమందించి నరునిల కలతపెట్టు
ఉపకరించని నీ కన్ను నూడదీయ
నరకమందదు నీ దేహ మెరుకపడవె. 91

ప్రభువునకు ప్రమాణంబును పలుకసాగి
అవని యాకాశముల తోడు యనగవద్దు
అమరలోకము దైవ యాస్థానమగును
వేరొకటి పాదపీఠము వేల్పునకును. 92

దుష్టశిక్షణ గావించ దూకవద్దు
చెంప వాయింప వేరొక చెంప జూపు
కీడొనర్చిన వారికి మేలొనర్చి
వేదనను పొంది మదిలోన వేడ్క పొందు. 93

నిస్సహాయులు నీధర నిన్ను జేరి
వేడుకొన నీకు, పెడమొఖం పెట్టవద్దు
లెమ్ము నాతోడ యొకమైలు రమ్మనంగ
అరుగు మాతని వెంబడి యాడుకొనగ. 94

శత్రు ద్వేషము మదిగొని సాగవద్దు
'మిత్రులన వీరె నాకని మెలగవద్దు
పరిమితం బంధుప్రేమ పవిత్రమైన
శత్రు ప్రేమను గొను! తండ్రి సంతసించు. 95

నీతిపరులకు కడు యవినీతి జెంది
దుశ్చరిత్రత పొందిన దుష్టులకును
ఏకరీతిని వారంత సాకగాను
వెలుగు వర్షాలనాతడు కలుగజేయు. 96

ప్రేమనిడువాని కెవ్వరైన ప్రేమనిడగ
నందులో లేదు నవలేశమైన ఘనము
మిగుల నీమీద ద్వేషము నింపుకొన్న
వారికిల ప్రేమనిడు నీకు ఫలముకలుగు. 97

ఖ్యాతికొరకిల నీతి కార్యాలటయ్య
ఫలముగొన గలరనుటొక పొల్లుమాట
దైవమే మెచ్చ చేయండి ధర్మములను
ఒరుల మెప్పుల కిదిచేయు టొప్పుకాదు. 98

ప్రార్థనలు చేయుటిలలోన పరులకొరక!
పరమభక్తులమని మీరు పలుకవద్దు
అన్యులెరుగక నీ పూజ నందజేయు
గోప్యముగనున్న నీ తండ్రి కోరునదియె. 99

నిర్మలంబగు ప్రేమము నింపుకొనగ
ధర్మరూపమె మదిలోన దర్శనమగు
నిర్మలంబగు భక్తితో నీవుకొలువ
తనయునకు ప్రతిఫలమును తండ్రి యిచ్చు. 100

# 5–వ ప్రకరణము

## ఆరాధన

ప్రార్థననగిది, యీ రీతి పలుకవలయు
'పరమునందున్న మా తండ్రి ప్రార్థన గొను'
తండ్రి నీ పేరు పరిశుద్ధపరచబడుచు
నీదు రాజ్యమె యిలమీద నిలచుగాక. 101

దివిని యాతని చిత్తమె దీప్తినందు
ఇహమునందున నారీతి యిముడుగాక
అనుదినాహారమును మేము యందుకొనగ
అవని మాకిడు మతుల దీవనలనెలమి. 102

నీకు ఋణపడియుంటిమి నిక్కమిలను
ఋజువుపడగను నీకును ఋణముదీర్తు
మేము మా ఋణస్థులను క్షమించురీతి
నీవు మమ్ముల క్షమియించి నీడనిమ్ము. 103

శోధనను బాపి కీడును దొలగగొట్టు
దుర్గతులనుండి కాపాడి మమ్ము బ్రోవు
మిలను రాజ్యము బలమీవె యేసుప్రభువ
మానసికమైన శాంతిని మాకునిడుము. 104

# 6-వ ప్రకరణము

## అమృతమూర్తి

కుష్ఠరోగికి స్వస్థత కూర్చెనార
కోరబడగనె రోగులు కోలుకొనియె
వడలినందలి దయ్యాలు వెడలిపోవ
రోగముల ద్రోలె లోకము బాగుపడగ. 105

దోనెగ్గెకొని జలమున త్రోవబట్టి
యరుగయంతట సంద్రాన యలలులేవ
నిద్రగొనుచున్న యాతని వద్దజేరి
శోకమున శిష్యబృందము కేకలిడిరి. 106

అరపులవి యేల నల్పవిశ్వాసులార
నిమ్మళించు తుఫానెల్ల నిమ్ముపడును
అనుచు గద్దించె నణగారి యంతమవగ
గాలి సంద్రాల శాసించు ఘటికుడతడు. 107

పాపముల రూపుమాపెడి పావనుండు
పతితులకు రక్షణంబిడు గతియు నతడె
పలువురానాడు ప్రశ్నించి పలుకగాను
పాపులను బ్రోతునేనని పలికినాడు. 108

అమృత హస్తము నీదని అందరనగ
మృతిని చెందిన చిన్నది బ్రతికి లేచె
పరమపావనమా కర స్పర్శనంది
దైవమన నీవె యనగ నిదర్శనంబు. 109

అంధులిరువురు నిను నమ్మి వెంటబడగ
కన్నులొసగావు ధరగాంచ కరుణగలిగి
మూగనందిన యొకడిల మూల్గుచుండ
మాట నిడినావు నీదు మహత్తు తెలియ. 110

మీలోగల యాత్మ తండ్రిది మీదికాదు
పలుకు వాక్యంబు యతని ప్రసాదముగద
పరితపించకు ఫలితము ప్రాప్తముగొన
పరమునందున్న తండ్రిపై భారమిడుము. 111

ఉదధిపయి నీవు నడవగ నదరిపడుచు
భ్రాంతినొందియు శిష్యులు భూతమనిరి
అదరిపోయిన వారితో ననియెనిట్లు
ధైర్యమొందుడు ప్రభువును భయపడకుడు. 112

జనసమూహము లానాడు ఘనతవినుచు
నాతనిని గొల్వనేగిరి యడవిస్థలికి
అల్పసంఖ్యలో గల రొట్టె లమితమవగ
అందరు భుజించిరానాడు విందుగొనిరి. 113

సూచకక్రియల నీరీతి జూపిగూడ
ఒరులకవి తెల్పనొల్లని గురుడతండు
మనుగడన్నది మాధుర్యమనగ నతడు
మహికినిడె దివ్యవిజ్ఞాన మార్గములను. 114

# 7–వ ప్రకరణము

## దైవ ప్రభోదము

అవనిలో నాత్మ దేదీప్యమందె నాడు
దేహపరమైన భ్రాంతులు దీరిపోయె
మిగుల నాధ్యాత్మికపు శక్తి మిన్నుముట్టి
లౌకికపు రీతి యొప్పె నలౌకికముగ. 115

అవని ధనరాసులను గూర్చ నాశవలదు
తస్కరుల చిమ్మెటలనంది తరుగ దందు
దైవరాజ్యాన గూర్చుడు ధనము మీరు
అన్యులకు చెందకది మీకు యుండగలదు. 116

నీదు నేత్రమునందలి నిండు వెలుగు
స్వీయదేహపు కాంతికి చిహ్నమగును
కన్ను చెదరిన యింకను యున్న దేమి
దేహమది కారుచీకటి దేలగలదు. 117

ఏకదాసుడు యజమాను లిర్వురనిల
గొలచి మెప్పుల నందుట కుదర దెపుడు
భక్తి శ్రద్ధల నొకనికి బాగ కొలచి
వేరొకని ప్రీతినందుట వినము మనము. 118

సిరిని వలచియు నీవిల మురియ గలవో
ప్రభుని గొలచియు పరమును బడయగలవో
దైవ సంపద లోకరికి దక్కవిలను
రెంటికిని దాసులగు టిల కంటకమగు. 119

వనమునందున్న లతలను కనుము నీవు
ఎదగగల శక్తి వాటికి నెటుల వచ్చె
మిగుల నారాట మదిలేక మెలగ గలవు
శోభితంబగు 'సోలమన్' సొగసు కన్న. 120

గగన పక్షుల మీరంత గనుడు వేడ్క
పంట పండించ నవి యేమిపాటు పడవె
కూడబెట్టగ లేమని కుంద వెపుడు
పోషకు డెవండు తండ్రియె పోషకర్త. 121

అరయుడారీతి యల్ప విశ్వాసులార
అవని బ్రతుకున కడియాశ నందవద్దు
అన్నిటినిగూర్చు నాదైవ మన్నియిచ్చు
కన్న తండ్రికి తెలియదా కర్త యతడె. 122

తీర్పునిచ్చుట యీధర తేలికేను
తీర్పుమేరకె యుండాలి తెలియుమీవు
ఎవరినేరీతి కొలవగ నెంచగలవో
సదరు రీతియె నినుగొల్చు సర్వమరయు. 123

స్వీయమగు తప్పిదాలెన్నొ చిందులాడ
ఒరుల తప్పుల బట్టగ నరుగుటేల
కంటిలోనున్న దూలము కానబడక
ఒరుల కంటినిగల నలుసెరుక పడెన. 124

శ్రేష్టతనుపొంది మిగుల ప్రసిద్ధిగొనిన
శునకములదేమి యెరుగు నా శుద్ధితనము
ముత్యములవైన మురిపాల మూర్తులైన
పందులకదేమి తెలుసా పసందుతనము. 125

వెదకునది యెల్ల నీకిల నెదురుపడును
అడగబడినది నీచేతి కమరగలదు
తీయమనికోర తలుపులు తెరువబడును
ఆత్మ విశ్వాసికివి యెల్ల నందగలవు. 126

అన్నమడిగిన వానికి మన్నుపెట్టు
మనుజుడుండడు ధరలోన మనకుదెలియు
తనయుడడిగిన తప్పక తండ్రియిచ్చు
ఈవిగలవాడు మన తండ్రి యెరుగుమీవు. 127

పరుల యేచర్య మనకు పసందు యగునో
ఒరులకది మీరలొనరించు టొప్పుగాదె
సంఘ సమతయు సఖ్యత సాగునపుడె
ధర్మశాస్త్రంబు యెరిగించు మర్మమిదియె. 128

అరయ జీవనద్వార మత్యల్పము గద
జూడ నేకొందరో యేగు జాడ యిదియె
పాప మార్గముజూడ నపారమిలను
పలువురాదారినేగుట తెలియగలము. 129

మోక్షమిదు ప్రవక్తలమని మోసగింత్రు
సత్యమగు దానినెల్ల నసత్యమనుచు
అసలు రూపాల నెరిగిల మసలరండి
గొఱ్ఱె చర్మాల తొడిగెడి క్రూరజాతి. 130

మధురరస మివ్వగలదిల మనకు ద్రాక్ష
ముండ్లపొదలే మదిచ్చును ముండ్లుగాక
సుఫలము లొసంగు జూడ సువృక్షములిల
ఫలములివ్వని ప్రతిచెట్టు యిలను తెగడె. 131

నా సువార్తను నమ్మిల నడచువాడు
బండపయి ఇల్లుగట్టిన ప్రాజ్ఞుడెయగు.
వానగాలుల కాయిల్లు వణక దెపుడు
సుస్థిరతనొందు చూడుడు సూక్ష్మమిదియె. 132

# 8–వ ప్రకరణము

## విశ్వ జ్యోతి

కాంతికిరణము జగతికి క్రాంతినొసగ
వెలుగు విజ్ఞానమదియన వింతగాదు
జ్ఞాన నేత్రముమెంతైన జాగృతిగొన
మూఢ యజ్ఞానరీతులు మూలబట్టు. 133

అవని శోకాగ్ని నార్పంగ నవతరించు
యమృత పరిపూర్ణ వాక్సుధాఝరియతండు
మందమతులెల్ల నాతని డెందమరయ
నుద్భవించిన యపురూప యద్భుతంబు. 134

కాంతి కిరణముగని ప్రజ కన్ను తెరచె
కరడుగట్టిన కలుషాలు కలతలన్ని
కరిగిపోయెను కిరణపు ప్రసరణమున
మసకలవి బాసె సత్యమె మనకు దోచె. 135

మానవుడు పాపి గనుకనె
దానవ సైతాను యెపుడు దరికే తెంచున్
దీనత జెందక శ్రుతివి
జ్ఞానము గొనుమపుడు నీదు జన్మతరించున్. 136

లోపముగల లోకములో
పాపపుపంకిల మదెల్ల పరుగిడుచుండున్
పాపాత్ముడ శరణనగను
కాపాడును నిన్ను ప్రభువు కరుణను బ్రోచున్. 137

పాపాత్ముల కిడు రక్షణ
లోపములవి యెన్నోజేసి లోకులుయున్నన్
కోపమునందదు పశ్చాత్తాపము,
జెందినను, వరము తప్పకయిచ్చున్. 138

పాపమున బుట్టియిల నెంతో పాపినను
సణుగుకొనుటేల నదియె సైతానుగుణము
ధరలో పాపాత్ములకునెల్ల స్థిరమునిచ్చు
వరములివ్వగ వచ్చెను వందనమిడు. 139

దుర్గతిని బాపి ప్రజలు సద్గతిని పొంద
సకల జీవాత్మలకు నీవు సాక్షివిగద
పృథ్వి చెడుగును బాపగ పుట్టితీవు
వేల్పులందున యెనలేని వేల్పువుగద. 140

అల్పమతులేమెరుంగునా యమృతమూర్తి
నెరుగ గలరిల జిజ్ఞాసపరులె సుమ్ము
కమలముల కాంతి కప్పలకేమి తెలును
తుమ్మెదలెరుంగు పుష్పాల గుమ్మరింపు. 141

మనసునందలి మలినపు మత్తుబాయ
మహిని నీ మధురోక్తులు మందు సుమ్ము
మధుర జీవన సుధలను మహికినిచ్చి
స్థిరతనందిన నీ గాథ ధరకె వెలుగు. 142

జ్ఞానరీతికి యెదురేమి జగతిలోన
సంకుచిత రీతులవి యెల్ల భింకమిడుచు
వెలుగుగదిగో చూడు వెలసెను విశ్వజ్యోతి
దోషులకు ధూర్తులకు నెల్ల త్రోవనిడఁగ. 143

ఆత్మ సౌందర్య భావన యవని వెలయ
లౌకికా ధ్యాత్మికతలిల లోకముఁగాన
వెలుగునందించి క్రాంతిని కలుగఁజేసి
భువిని దివిగను మార్చిన దేవుడతడు. 144

# 9-వ ప్రకరణము

## ముగింపు

హర్షమందుచు సద్భక్తులాత్మలోన
దలచిరెంతయు క్రీస్తును దైవముగను
భువికి దెలిపితి నీరీతి కవినిగాన
కాంతికిరణము జగతికి క్రాంతి నొసగ.

సమాప్తం

---